# ప్రముఖ సాహితీవేత్త డా.దేవరాజు మహారాజు

## రచనా నేపథ్యం- రచయిత స్వీయ విశ్లేషణ



డా. దేవరాజు మహారాజు గారు బహుముఖ ప్రజ్ఞాశాలి, హేతువాది, జంతుశాస్త్ర నిపుణుడు, మొక్కలలో ఉండే నిమటోడ్ పరాన్న జీవులపై పరిశోధన చేశాడు. **డాక్టర్ దేవరాజు మహారాజు** గారు సమాజంలో శాస్త్రీయ అవగాహనను పెంచడానికి సరళ విజ్ఞాన శాస్త్ర గ్రంథాలు, వ్యంగ్య రచనలు చేశాడు. కవిగా, కథా రచయితగా, నాటక కర్తగా, అనువాదకుడిగా, కాలమిస్టుగా, వ్యాసకర్తగా బహుముఖమైన ప్రతిభ చాటారు.

డా. దేవరాజు మహారాజు ఫిబ్రవరి 21, 1951 న వరంగల్ జిల్లా కోదూరులో జన్మించారు. స్వగ్రామం వడపర్తి, భువనగిరి. ఉస్మానియా యూనివర్సిటీ నుంచి 1975లో జంతుశాస్త్రంలో ఎంఎస్సీ, 1979లో డాక్టరేట్ అందుకున్నారు. జువాలజీ ప్రొపెసర్‌గా పరాన్న జీవులపై పరిశోధనలు చేస్తూ, చేయిస్తూ పిజి విద్యార్థులకు, పరిశోధన విద్యార్థులకు 28 ఏళ్లు మార్గదర్శనం చేసారు. తెలంగాణా ప్రజల భాషలో కవిత కథ చెప్పి మెప్పించి కవిగా, కథకుడిగా స్థిరపడ్డారు. భారతీయ భాషల కవిత్వాన్ని కథల్ని తెలుగులోకి అనువదించి తెలుగు కళ్లకు ఇరుగుపొరుగు దృశ్యాల్ని చూపించారు. జానపద సాహిత్య పరిశీలన చేశారు.

గుడిసె గుండె (1974), గాయపడ్డ ఉదయం (1990), (1996 మరాఠీ దళిత కవిత), రాజముద్ర (2007) మొదలైనవి కథా సంపుటాలను వెలువరించారు. దేవరాజు మహారాజు కథలు (1993) మొదలైనవి ఈయన కథా సాహిత్యం. అంతేకాక బుజంగు (1984) గురువుకు ఎగనామం (1984), వంటి బాలసాహిత్యాన్ని సృజించారు. వీరు జంతుశాస్త్రవేత్త కనుక వీరు అనేక శాస్త్రీయ విషయాలను చెప్పే అనేక గ్రంథాలను రచించారు. మూఢనమ్మకాలు–సైన్సు (1991'), లైఫ్‌టానిక్ (వైజ్ఞానిక నాటికల సంపుటి) 2007, మూఢనమ్మకాల్ని వదిలిద్దాం (2006) ఇక్కడ పేర్కొన్న రచనలు కేవలం ఆయా రంగాల్లో ఆయన రచించిన రచనాసర్వస్వానికి ఉదాహరణమాత్రాలే.

ఈ కృషికి ఎన్నో అవార్డులు. గౌరవాలు అందుకున్నారు. వాటిలో కొన్ని ఇక్కడ పేర్కొనడమైంది. 'గాయపడ్డ ఉదయం' వచన కవితకు తెలుగు విశ్వవిద్యాలయ ప్రధాన అవార్డును 1991లో పొందారు. రాష్ట్ర ప్రభుత్వం ఉగాది సత్కారం, తెలుగు విశ్వవిద్యాలయ కవితా పురస్కారం, ఒక దశాబ్ది కాలంగా నేషనల్ బుక్‌ట్రస్ట్‌వారికి (న్యూఢిల్లి) సలహా సంఘ సభ్యులుగా యున్నారు.

**వక్త: డా. దేవరాజు మహారాజు (ప్రముఖ తెలుగు సాహితీవేత్త, జీవశాస్త్రవేత్త)**

**ప్రారంభోపన్యాసకులు: డా. పిల్లలమర్రి రాములు (అసోసియేట్ ప్రొఫెసర్, హై.వి.వి.)**

**స్థలం: అంబేద్కర్ ఆడిటోరియం** **హైదరాబాద్ విశ్వవిద్యాలయం**

**తేది: 15/09/2016; గురువారం** **సమయం: సాయంత్రం 4:30 గం.లకు**

## అధ్యయనం తెలుగు కళాసాంస్కృతిక సాహిత్య చర్చావేదిక

హైదరాబాద్ విశ్వవిద్యాలయం – గచ్చిబౌలి, హైదరాబాద్.

ఫోన్: 9963709032, 8341051560

అందరికీ ఇదే మా సాదర ఆహ్వానం